వ. నన్ను నెక్కడ దాఁచె దనుటయు సంధ్యాసమయానంతరంబ యంధకారం బున నయ్యుత్పలగంధిం బురంబువెలికిం గొని చని యొక్క పూఁదోఁటలోఁ పల నత్యంతవిస్తారంబై తనరు బూరువృక్షానికోటరంబున నునిచి వేగుజా మునప్పు డాకమలాకరు వచ్చించి నీపాలికిం జనుదెంచెద వెఱవకుండు మని యూఱడించె. ౯౮

సీ. .........యక్షుణాలంకృతం బైన సముదీర్ణభద్రగజంబు నెక్కి
కుంజరాందోళికాఘోటకారూఢులై ప్రాణమిత్రులు తమ్ము బలసి కొలువఁ
బాఠకనికురుంబపఠనరవంబులు గర్ణామృతంబు లై కరము మెఱయ
ముందట నెలకొన్న నందడిఁ దూలఁగించు నురువేత్రహస్తులయుఱిది చెలఁగఁ
జారుతరదీపికాసహస్రములు వెలుఁగఁ
బెండ్లిశృంగారమునఁ జాలఁ బెంపు నొంది
యఖిలకమలాకరుఁడు కమలాకరుండు
రమణ మీఱంగ విదిశాపురంబు సొచ్చె. ౯౯

వ. అయ్యవసరంబున. ౧౦౦

క. మదగజఘోటకములతోఁ, మృదుపాఠకరవము చెలఁగ మే నలరంగా
నెదురుకొనియెఁ దనయల్లుని, విదిశాపురనాయకుండు విభవం బెసఁగన్.

వ. ఇ ట్లెదురుకొని తోడ్కొని చని రైవయోగంబున హంసావళీభావంబు గలిగి కా దని యెఱుఁగరాని కమలమంజరిని మహావైభవంబున వివాహంబు గావించుటయు నాఁడ విశేషశుభదినం బగుట నశోకకళికతోడ నయ్యెం దువదనం దోడ్కొని కరదీపికాసహస్రంబులు ప్రజ్వరిల్లం గమలాకరుండు శిబిరంబున కరుగునప్పుడు కుంజరంబుమీఁద నన్నరేంద్రకుంజరు వెనుక నున్న కృతకహంసావళి తానురాజనందన నునిచివచ్చిన శాల్మలీపాదపంబుఁ గనుంగొని యుత్తరుణి తా నత్తరువు దహించునుపాయం బూహించి యొడలికి వడంకు దెచ్చుకొని పతిం గౌఁగిలించిన. ౧౦౧

క. మలఁగి కనుంగొని ధరణీ,తలవిభుఁ డిది యేమి యనినఁ దాఁ బలుకక క
న్నులుమోడ్చియుండెఁ బలుమఱుఁ, దెలుపఁగ నొకకొంతవడికిఁ దెలిసినభంగిన్

వ. కన్ను లొకించుక దెఱచి యా రెలుంగున నతనికి వినవచ్చునట్లుగా నిట్లనియె.

మ. అలభూజంబుననుండి దైత్యపతి యత్యాభీలభంగిన్ దృగం
చలముల్ నిప్పులవెల్లి గొల్ప ననుఁ దా జంకించినన్ భీతిమై

నులుకం గన్నులు మోడ్చి భ్రాంతమతి నై యున్నంత నామ్రోల ను
జ్జ్వలవిప్రాకృతిఁ దోఁచి యి ట్లనియె వాత్సల్యంబు దీపింపఁగన్. ౧౦౫

ఉ. ఇక్షుజ మగ్నిదేవునకు నిప్పుడ యాహుతిచేయఁ ద్రుంగు నీ
ర్చక్షైసఁ బ్రుంపకున్న విది రాసుతుతో మననీను నిన్ను నీ
వెక్కసుభీతి మైఁ గలఁగ నేటికి నీపతితోడ నింతయున్
స్ఫుక్కక చెప్పు మం చరిగె సోఁకును బాయఁ దొడంగె నంతటన్. ౧౦౬

క. నావుడు నే నవ్విధమును, వేవే చేయింతు నీవు వెఱవకు మని దం
తావళము నిలుపఁబంచి మ, హీంద్రభుఁ డయ్యెంతి మ్రోల నిడుకొని కడకన్.

క. భటకోటిఁ జూచి మీ రీ, విటపిని దహియింపుఁ డనిన వెసఁ గాష్ఠము లో
త్కట మొదల నొంటి యుంచు, త్కటముగ నలుదెసల నగ్గి దరికొల్పి రొగిన్.

సీ. అంతకముంద యత్యుగ్రకోటరంబున నురగభయంబుచే నుండ నోడి
హంసావళి తొలంగి యక్కోఁట యం [illegible] నాక సోదరింటిలోన నుండి
యమ్మహీజము గాల నడరు పెన్మంటలఁ బగలింటిగతి దీప్తి పరఁగుటయును
బహుశతకరదీపపంక్తులు వెలుఁగొంద భద్రగజంబుపైఁ బ్రజ్వరిల్లఁ
గమలమంజరి మ్రోల డగ్గఱి వసింప, నతిమనోహరమూర్తిఁ జెంపందియున్న
చెలువుఁ గమలాకరునిఁ గన్నులలరఁ జూచి, యచ్చెరువు రాఁగ శోకములాత్మఁ దనర.

క. రాచిలుక మున్ను వ్రాసిన, యాచిత్రము గజము మీఁది కరుదెంచిన య
ట్లే చూపులపండువ యగు, నాచెలువుని చెలువ మాత్మ నలరింపంగన్.

శా. ఈరా జాశుకరాజు చెప్పినతఁడౌ నీచెల్వు చెల్వంబుఁ గ
న్నారం గన్గొని కామబారిఁ బడి మాయ ల్వన్ని నన్నాపి నే
ర్పారంగా వరియించె నన్నిఁక నీ నాహారంబు గావించెఁ బెం
పార న్నాకొఱకై కుజంబు నిటు సేయం బంచెఁ బాపాత్ముఁ డై. ౧౧౧

సీ. ఈవరు మదిఁగోరి యిచటి కేతెంచిన నెదలోన ననుమాన మేల పుట్టె
వరుని యున్నెడకు జవ్వనిఁ బంపఁ దగ దన కేల పంపితి దీని నితనికడకు
నితని నిందించిన నిట్టివాఁడు నృపాలుఁడే యనుబుద్ధి నా కేల పుట్టె
హీనభావునకు నన్నీఁడని యెఱిఁగియు నాతండ్రి మది నేల నమ్మనైతి
నిట్టిపాతకిఁ జెలిఁ జేసినట్టి బ్రహ్మ
యిన్నివిధములఁ దెలియంగ నేలయిచ్చు
నిన్నియును నేల యతఁడు ప్రాణేశ్వరుఁడుగ
నోము నే నోమఁగాక తొల్బామునందు. ౧౧౨

## సప్తమాశ్వాసము.

క. ఈయింతి తలఁచినట్లుగ, నీయగ్నిం గాలనైతి నీభూజముతోఁ
గాయజువహ్నుల నిచ్చలు, నేయనువునఁ గాలుదాన నింకిటవిధియా. ౧౧౩
వ. అనుచుఁ గన్నీరు వెల్లిగొన నన్నీరజనయన బహుప్రకారంబులం బలవించుచుండె నంత నమ్మహామహీరుహంబు హుతాశనుని కశనంబు చేసినదాన సంతుష్టహృదయ యైన యయ్యింతితో శిబిరంబున కరిగియున్నంత. ౧౧౪
క. కమలాకరుమై దైవకృ, తమునం బ్రబలజ్వరంబు దనుకొందుటఁ గృ
త్రిమహంసావళి తనచి, త్తమునం జింతింపఁ దొడఁగెఁ దద్దయు భీతిన్ ౧౧౫
గీ. శిరమునందుహంసావళి కరముపెట్ట,జ్వర మతిత్వరగతి మాను జనుల కనుచు
విన్నవాఁడిప్డునన్నునివ్విధముచేయఁ,బనిచిబొంకైననను మానవడువిభుండు.
క. నాచెలి యశోకకలికయు, నాచేసినచేఁత తెలుఁగు నరపతి యడుగన్
వే చెప్పనేని నక్కట, యేచంద మొనర్చుదాన నేనిటమీఁదన్. ౧౧౭
వ. అని చింతించి యనంతరంబ యొక్కతెఱఁగు గాంచి శూన్యలింగంబున భాగరక్తాభిషేకంబును దన్మాంసపూజనంబును నరబలియు నొనర్చిన జ్వరశాంతి యగునంట మున్నొకజోగిశిచే వింటి నని యశోకకళికతో నరబలిప్రకారంబు చెప్పక తక్కినవిధంబు చెప్పి శివలింగస్థానంబునకుం దోకొని చని యేమఱించి వధియించి యీయాపద నిర్వహించెద నని నిశ్చయించి యప్పొలంతితోడం జెప్పవలయువార్తలు చెప్పి ప్రతీహారపాలాధ్యక్షుం డగు వృద్ధు రావించి. ౧౧౮
సీ. వసుమతీశ్వరునకు జ్వరము మానంగ రహోవిధికృత్యముల్ సలుపవలయు
నర్ధరాత్రమునప్పుడాఁకువా రెవ్వరు వెడలివచ్చిన నడ్డపడకుఁ డనుచుఁ
జెప్పి పోవఁగఁబంచి చెలియును దానును భాగపూజాద్రవ్యచయముగొనుచు
నసిహస్త యై శూన్యహరగృహంబున కేగి యజస్రక్తమజ్జనం బాచరించి
యయ్యతివ శంభుపూజసేయంగఁబంచి,తత్పరతఁబూజ మొనరించుదానిఁ జేరి
తద్గళము వ్రేయుటయు హేతిధారదప్పి, దైవవశమున నష్టంబు దాఁకుటయును.
వ. అశోకకళికయు బెగ్గిలి యగ్గలంపు హాహారవంబు లెసంగ గుడివెడలి పఱవం దొడంగిన. ౧౨౦
క. తలయును జీరయు వీడఁగ, బలుబూతము పోలె వెంటఁ బడి చనుదేరం
దలఁకుచు నశోకకళికయు, నెలుఁ గెత్తి విషాద మడర ని ట్లనిపలికెన్. ౧౨౧
గీ. పాడుగుడిలోనిభూతము గూడముట్టి, వెన్నడింపఁగఁ దొడఁగె నోయన్నలార
కంటిరేయని మొఱపెట్టఁగాఁదొడంగ, నయ్యెలుఁగు విని తలవరు లడ్డగించి.

వ. వస్త్రాపవరణయు నాలంబకేశభారయు నాభీలకరవాలహస్త యు నైదాని వెంటం బఱతేర వారలు గనుంగొని భూతం బనుచుం బొడివి పలుతునియ లు గావించిన. ౧౨౩

గీ. అయ్యశోకకళిక యాత్మనిర్ముక్తయై, యంతిపురము సొచ్చి నంతలోన
శంభుపూజకతన జ్వరముక్తుఁడై యున్న, మనుజవిభునిఁ జేరి వినత యగుచు.

వ. కమలమంజరి చేసిన కపటకృత్యం బెఱింగించిన నరసి వెఱఁగుపడి హంసా వళివలని బలవంతం బైన వలవంత నొందుచు నాక్షణంబున మంత్రుల రా వించిన నందఱుం జింతాక్రాంతు లై యున్నసమయంబున భీమభటుండు జ్యోతిశ్శాస్త్రపారగుం డైన వసంతకు నాలోకించి ప్రశ్నం బడిగిన. ౧౨౪

గీ. అనలనిహతిఁ బడదు హంసావళీకన్య, సేమమున నరేంద్రుఁ జేరు ననిన
మదిఁ దలంకు మాలి మాళవాధిపునకు, వార్తఁ జెప్పఁదగినవారిఁ బనిచి.

వ. భీమభటుండు దిగ్గన లేచి మననేర్చువిధంబున మాళవేంద్రకన్య నరయిం తము రం డని చెలులం దోడుకొని యత్యంతసంభ్రమంబునం జని. ౧౨౫

మ. సరసానందనసత్కళాగమహరిత్కూలంకషకందార భా
స్వరనానారసభావనిర్మథన భోజక్ష్మాప విద్యానిరం
తరగోష్ఠీజగదేకమల్ల బహుశాస్త్రగ్రంథసిద్ధాంతవి
స్తరవిజ్ఞానకవిత్వతత్త్వకలనా సర్వజ్ఞసోమేశ్వరా. ౧౨౬

క. వీణావాదనచలదలి, వేణీవేణీప్రసూనవిహాసగ్ధుప
శ్రేణీగానాకర్ణన, ఘూర్ణీకృతనేత్ర హారితగోత్రపవిత్రా. ౧౨౭

లయగ్రాహి.

చంద్రరుచిరాననమహేంద్రబహుభోగభుజగేంద్ర మృదుభాషణదినేంద్రసమతే జాసాంద్రశుభలక్షణధనేంద్రధన నైభవమృగేంద్రపటువిక్రమగిరీంద్రనిభధైర్యా మంద్రజయఘోషణఖగేంద్రజవవాహన శిబీంద్రఘనదానమనుజేంద్రహితకృ త్యా,రుంద్రమతిజృంభణరతీంద్రలలితాంగకగజేంద్రబలబంధురకవీంద్రనుతకీర్తి

గద్యము—ఇది శ్రీమద్వెన్నలకంటి సూరనామాత్యపుత్త్ర హారితసగోత్ర పవి త్త్ర సుకవిజన మైత్రీవిధేయ అన్నయనామధేయప్రణీతంబైన షోడశకుమార చరిత్రంబునందు సప్తమాశ్వాసము.

---

శ్రీరస్తు.

# షోడశకుమారచరిత్రము.

— అష్టమాశ్వాసము —

క. శ్రీభాసమాననానా, వైభవ జయలాభ ... ... ... ...ననితాంత
స్వాభా ...తసౌరభ, శోభితపాండిత్య యన్నసూరామాత్యా. ౧

వ... ... ... ... ...మంబులు గడపి విరహతాపోపశమనార్థంబు మహీతలనాథుండు శీతలచ్ఛాయ నొక్కరుండును నాసీనుం డై యుండి యశోకకలిక నచ్చటికిం బిలువంబంచి సమీపంబున నునిచికొని హంసావళి యేమయ్యె... ౨

క. భూనాథ కమలమంజరి, తో నాఁడటు నేను నరిగి తుదముట్టంగా
మానుగ నవ్విధ మంతయు, నే నెఱుఁగుదు విన్నవింతు నేర్పడ నేకున్. 3

వ. సకలలోకాభిరామం బగునారామారత్నం బొక్కనాఁడు స్వర్ణనాగారంబున కరిగి తదీయమణికుడ్యభాగంబునందు- ౪

చ. నరవరముఖ్య నీదయిన నవ్యమనోహరమైనరూపు చి
త్తరువున వ్రాసి యున్నఁ గని తద్దయు వేడ్కలు నివ్వటిల్లఁగా
నరులున జెప్పవెట్టక చలాకృతిగుం... ... ... ...నేపుదానుజి
త్తరువునఁబోలె నుండి వనితామణి రాగపయోధిమగ్న యై. ౫

వ. అప్పుడు— ౬

సీ. సుదతి యారూపంబు చూచినయట్లైన లీలమై జెప్పలు వ్రాలనైచు
భామ యారూపంబు పలికినయట్లైన వేడుక మాటలు వినఁగఁగోరు
నింతి యారూపు దన్నేలయించినట్లైన నర్థిఁ జేరఁగఁ జన నప్పళించుఁ
గాంత యారూపంబు గదిసినయట్లైన నాలింగనముసేయ నాససేయు
నివ్విధమునఁ జిత్తమెంతయుఁ దగిలినఁ, దన్ను మఱచియుండె ధవళనయన
లలితచిత్రమగుటఁ దెలిసియుఁ దెలియక, మరుఁడుదన్ను మిగులమరులుకొలుప.

వ. ఇట్లత్యంతసుందరం బగు నచ్చిత్రరూపంబుఁ జూచి యుచ్చట నీరూపం బెవ్వరు వ్రాసి రని యడిగిన సకలవిద్యావిశారదత్వంబు... ... ... ౭

చ ... ... ... ... ... ...
నొప్పెసలారరక్తచం
దనమున వ్రాసి యింతి మఱునాఁడు ప్రమోదము నివ్వటిల్లఁగన్. ౯

క. చిలుకఁ బిలిపించి రసవ, త్ఫలములు పసదనము నిచ్చి తథ్యసువర్ణో
జ్జ్వలచేల మొసఁగి సద్గుణ, కలితా పురుషార్థనిధివి గమ్మని పలికెన్. ౧౦

క. ఆర్యానుతిపాత్ర మగున, య్యార్యఁ జదివిచూచిమెచ్చి యాశుకమును రూ
పార్య వగునీకు శిక్షించం, బ్రార్యమనయవసము నన్మహాత్మునిఁ దెత్తున్. ౧౧

వ. అని పలికి సముచితప్రకారంబున వీడుకొని రాజశుకంబు చనుటయు నది యవశ్యంబు నిన్నుఁ దెచ్చు ననునాస నూఱడి యనేకదివసంబు లెదురుచూచి రాకతడసిన నొక్కనాఁ డమ్మంజువాణి కమలమంజరి దెసఁ గనుంగొని.

క. ఆచిత్రాకృతి పతి దృ, గ్గోచరుఁ డగుటయును గలదొకో యొకనాఁ డా
రాచూలిని నిట్లన వల, రాచయురులఁ బెట్టునొక్కొ రాచిలుక చెలీ. ౧౩

క. మెచ్చునొకొ యార్య యిచ్చకు, వచ్చునొకో రాజశుకము వాక్యములతనిం
దెచ్చునొకొ చిలుక యెంతకుఁ, దెచ్చునొకో మరుఁడు నన్నుఁ బతిఁ దేకున్నన్.

వ. అనినఁ గమలమంజరి యిట్లనియె. ౧౫

క. నీచెలువము రసికాగ్రణి, యాచిలుక నుతింప మిగులనరయకయుండన్
నీచిత్తమువాఁడే పతి, యోచెలి యిటు లేల చింతనొందఁగ నీకున్. ౧౬

వ. అనిన నమ్మాటకు నెమ్మనమున నమ్మిక జనింపకున్న నచ్చెలువ నెచ్చెలి నాలోకించి. ౧౭

ఉ. ఓజలజాక్షి నీవు నను నూఱడఁ బల్కెదు గాక వచ్చునే
రాజశుకంబు, పేడ్వడలి రమ్మనిన న్నను మేల, యమ్మహా
రాజున కిచ్చ గూర్చి యిటు రా మనమెక్కడ నాతఁడెక్కడే
యోజఘటించుఁగార్యము శుకోక్తుల నిట్టడియాస వెట్టనో. ౧౮

క. అని పలుమఱుఁ దలపోయఁగ, దినదినమున కంగజుండు ధృతిదూలింపన్
మనమునఁ గలఁగుచుఁ దేఱుచు,ఘనపరితాపంబుచేతఁ గ్రాఁగఁ దొడంగెన్.

మ. ప్రిదిలెం జేతులకంకణంబులు సఖీబృందంబుపై మచ్చికల్
వదలె న్మత్తమధుప్రతారవముల న్వాసంతికావహ్నిచే
వదలెన్ ధైర్యము చిత్తసంభవశరవ్యంబై మనోజ్ఞంబు గ్ర
క్కదలెన్ మైఁ బరితాపవహ్ని పొదలెం గంజాతపత్రాక్షికిన్. ౨౦

వ. అవ్విధంబు గనుంగొని కమలమంజరి చిత్తంబునఁ జలింప నెచ్చెలి నవలోకించి. ౨౧

గీ. చిలుకవెంటన వలరాచచిచ్చు దగిలి, యకట పన్నీరు చల్లిన నాఱిపోదు
పుష్పధూళి పైఁబోసినఁబొనుఁగుపడదు,కొమ్మ నేక్రియ నోముదు నమ్మలార.

గీ. ఇందులోన నెవ్వారికి నెఱుక లేద,యకట పూఁబాన్పు చేసెదమనుచుఁదెచ్చి
భావసంభవునమ్ములపాన్పుమీఁద, ముదితఁ బెట్టినవారలు మోసపోయి.

ద్రుతప్రకృతిమీఁదను గూడ, తే=ఆపరుషములు, సరళ స్థిరసన్ని=సరళ స్థిరములే నై యుండును. అంబనుగాలిచెద, శుభముచుబడసెదో.

---

గసడదవా స్స్యుః ప్రథమాంమాత్రా దాత్మాస్వదో ర్వినైవైతే
నవికృతిశబ్దా త్పరత స్సాంస్కృతికానాం భవన్ని గసడదవాః. ౨

ఇది రెండు సూత్రములు. ఆత్మా స్వదోః=ఆత్మ, అస్మచ్ఛబ్దములు, వినైవ=వినాగాను, ప్రథమామాత్రాత్=ప్రథమావిభక్తిమీఁద నున్న, ఏతే ఏవ=ఈ పరుషములే, గసడదవాః స్యుః=గసడదవ లగును. సిరిగలవాఁడు, దిక్కుగలవాఁడు, దానముసేయును, ధీరుఁడు డొక్కులఁబోవును, (ఇల్లు దామరతం పర) నిజమువల్కును. ప్రథమామాత్రాత్ అన్నాఁడు గనుక ప్రథమాసమాసముమీఁదను వచ్చును. అప్పుడు గనిపించె, ఇప్పుడు దానచ్చె- ఆత్మాస్వదర్థములకు లేవు. తాఁజెప్పె, నేఁజదివితి. వికృతిశబ్దాత్=తెలుఁగుమాటకంటె, పరతః=పరమైయుండెడి, సాంస్కృతికానాం=సంస్కృతశబ్దములకు, గసడదవాః=గసడదవలు, న=లేవు. దొర కరుణించె, సిరి చంచలము, మాయయ్యటంకాయుధుఁడు, మీవేల్పు తోయాధిపతి, వీఁడు పావనుఁడు.

---

లు గ్వా ద్రుతప్రకృతికా త్పరత స్సరళే స్థిరే చ నస్య స్యాత్
అలుకి చ సంశ్లేష స్స్యా ద్విత్వం ప్రవదన్తి తం క్వచి త్కేచిత్. ౩

ఇది మూఁడు సూత్రములు. ద్రుతప్రకృతికాత్=ద్రుతప్రకృతిమీఁదను, పరతః=పరమైన, సరళే=గజడదబ లయినను, స్థిరే=యాద్యక్షరము లయినను నుండినమొదల, నస్య=నకారమునకు, లుక్ వా స్యాత్=లోపము వికల్పమున వచ్చును. కొలుతుగ్ గదాధరు, కొలుతు గదాధరు. పల్కెదుగ్ సత్యము, పల్కెదు సత్యము-ఇత్యాది. అలుకి=లోపము లేనప్పుడు, సంశ్లేషశ్చ=పైయక్షరముతో సంయోగమును, స్యాత్=అవును. చకార ప్రయోగమువలన, స్వభావమున నున్నను నుండు ననుట. విడుతుగ్ దురితము, విడుతును దురితము. తం=ఆనకారము ను, క్వచిత్=సరళస్థిరములు పరమైనప్పుడు కొన్నిచోటుల, కేచిత్=కొందఱు పెద్దలు, ద్విత్వం ప్రవదన్తి=ద్విత్వముగాఁ జెప్పుదురు. *మెచ్చెం మాధవుఁడు, నాకుం జనకుఁడు. ఈమతము కేచిత్పక్షము గనుక ప్రయోగమూలము.

---

* మెచ్చెమ్మాధవుఁడు, మెచెన్మాధవుఁడు,

సర్వ త్రాజ్వ త్కార్యం జ్ఞేయం యస్య ద్రుత ప్రకృతి కేభ్యః
లుకస్సంశ్లేషో నా చి ద్రుతస్య సర్వ త్ర లు క్సమాసేషు. ౯

ఇది మూఁడుసూత్రములు. ద్రుత ప్రకృతి కేభ్యః=ద్రుత ప్రకృతుల మీఁద నుండెను, యస్య=యకారమునకు, సర్వ త్ర=అంతటను, అజ్వత్=అచ్చునకు వలెను, కార్యం=వచ్చెడికార్యము, జ్ఞేయం= తెలియఁదగినది. లుకస్సంశ్లేషములు లేవనుట. కలిగె నెన్మో, సిరికి నెద కలిగె న్యెన్మో యనుసంశ్లేషము గాని కలిగె యెన్మో యనులోపము గాని లే దాయెను. ఆద్యక్ష యకారము గనుక యెత్వము వచ్చినది. ఓయీ యెత్వము రాఁ జెప్ప నేల, అజ్వత్కార్యము వచ్చు నన నేల? ఆదియందు యకారము లేదు, అచ్చే కాని యనినఁ జాలదా యంటేఁ, జాలదు. ప్రయోజనాంతరము* లేకున్నను నుచ్చారణవిరోధ మగుచున్నది, గనుక, యకార మెకారము గానేరదు. లుకస్సంశ్లేషో=నకారలోపమును, దత్సంశ్లేషమును, అచి=అచ్చు పర మైనపుడు, న=లేవు. భజియింతు నంబను, త్యజియింతు నఘములు. ద్రుతస్య=ద్రుతమునకు, సమాసేషు=సమాసములయందు, సర్వ త్ర=అంతటను, లుక్=లోప మగును. విరికల్వ† తెల్లదమ్మి.

---

ను మ్చోతః పరుషాణాం గసడదవా స్స్యుః పదాద్ద్వన్ద్వే
సామానాధికరణ్యే ష్వాదన్తానాం టుగాగమో౽చి స్యాత్. ౧౦

ఇది మూఁడుసూత్రములు. నుమ్ చ ఉతః-ఉతః=ఉకారమునకు, నుమ్=సమాసమందు నుమ్ అనునది వచ్చును. శబ్దసూత్రప్రాప్తిని ఉకారమకారములు లోప మగును. అలరుఁ జొంపము, చిగురుఁగైదువు. పదాత్=శబ్దముమీఁద నుండెడి, పరుషాణాం=కచటతపలకు, ద్వన్ద్వే=ద్వన్ద్వ సమాసమందు, గసడదవాః=గసడదవలు, స్యుః=అవును. అరిగోరులు, కాలుసేతులు, తల్లిదండ్రులు, ఊరువల్లెలు. సామానాధికరణ్యేషు=కర్మధారయసమాసములయందు, అచి=అచ్చు పరమై యుండిన, ఉదన్తానాం=ఉకారాన్తపదములకు, టుగాగమః=టుక్ అనునాగమము, స్యాత్=అగును. "శత్రువ దాదేశః, మిత్రవ దాగమః" అను న్యాయమున నుండెడివి యాదేశాగమములు. టుక్కులో, ఉకారకకారములు శబ్దసూత్రప్రాప్తిని లోప మైన నంత్యమందుఁ బొల్లుటకారము నిల్చును. అలరుటాకులు, కఱకుటమ్ములు, గిలుకుటందెలు, ఇత్యాది.

---

*ప్రయోజనోత్తరము పా. †సోమముచందురుఁడుఁ-మూ.

దారార్థేత ఉదపి రో మోస్తు విభక్త్యేకవచనకే పుంపూ
ప్రథమలు గపి ద్విను ల్వో రిచ్చ విభక్త్యన్తిమస్య జే రలిచ. ౧౧

ఇది యైదు సూత్రములు. దారార్థే=పత్నీవాచక పదము పరమయిన, అతః=అకారాంతపదముల యొక్క యకారమునకు, ఉత్=ఉకారమును వచ్చును, అపి రః=దానిమీఁద రవర్ణమును వచ్చును. సామానాధికరణ్యమె యను వర్తించునది. ధీరురాలు, శూరురాలు. విభక్త్యేకవచనకే=ప్రథమైకవచనమందలి, మోః=ముకారమునకు, పుంపూ=పు అనునది యు, బిందుపూర్వకమైన *ంపు అనునదియు నగును. సరసపుఁబలుకులు, సరసంపుఁబలుకులు. ద్వినుల్వోః-ద్వి=ద్విత్వముగల, నుల్వోః=ను, లు, అనువానికి, ప్రథమలు గపి=ద్విత్వముల లో మొదటిదానికి లోపము నగును. కనుదమ్మి, ములుగంప. విభక్త్యన్తిమస్య=విభక్తులయొక్క తుది అకారమునకు, ఇచ్చ=ఇకారమును నచ్చును. నీచేతిప్రోపు, నాతోడివారు, తనవలనిబిరుము. జేః=సప్తమికి, అలిచ=అలి యనునాగమము ను వచ్చును. నీయందలికరుణ.

---

ఔపవిభక్తికసంజ్ఞావర్ణా ష్టింట్యాదయో భవన్తిహ
రుల్వాదే ర్నామ్నాం స్యు స్తేహి విభక్తౌ సమాసే చ. ౧౨

ఇది యేకసూత్రము. ఇహ=ఈతెనుఁగు వ్యాకరణమందు, ఔపవిభక్తిక సంజ్ఞాః=ఔపవిభక్తికము లను పేరుగల, వర్ణాః=వర్ణములు, టింట్యాదయః=టి, ంటి మొదలైనవి. భవన్తి=అగుచున్నవి. ఆదిశబ్దముచేత- తి, ౯, మొదలైన వానికి గ్రహణము. తే=అవి, నామ్నాం=శబ్దములయొక్క, రు ల్వాదేః=రు,లు, ఇత్యాదులకు, విభక్తౌ=విభక్తిపరమైనపుడును, సమాసేచ=సమాసమందును, స్యుః=అవును. కొన్నిచోట్ల సమాసవిభక్తుల రెంటియందును గూడ వచ్చును. ఏటికి, విభక్తి; ఏటికాల్వ, సమాసము. వింటిచేత, వింటినారి. త్రాడునందు, విభక్తియందు లేదు; త్రాటిచెట్టు, సమాసమునకుఁ గలదు. ఈలాగే తెలియునది. కూటికుండ, అంబటినీళ్ళు, నేతిముంత, మిర్తిచేను, కర్తిమొన. కంటికి, గొడ్డంటి చిప్ప, పామునకు, పాఁపతేఁడు, వేమునకు, వేఁపచెట్టు, ఇత్యాది. ఔపవిభక్తికములు బహుప్రకారములు. విభక్తిసమాసములయందు యథాయోగ్యముగాఁ దెలియునది. రుల్వాదులకే కొన్నింటికి రావు. పైరుజొంపము, కల్లుకుండ, ఎన్నుగంట-ఇత్యాది. ఔపవిభక్తికవర్ణములు గలవెల్ల నౌపవిభక్తికములు.

---

* బిందుయుక్తమైన-

వా త్త్వాస్తదో ర్ద్రుతస్య స్యా ల్లు గ్వాక్యా న్తగతపదానాంచ
నలడాదే రన్తరుత శ్చాన్యేషాం చ ప్రయోగమహితానామ్. ౧౩

ఇది నాలుగు సూత్రములు. ఆత్త్వా న్తదోః=ఆత్త్వా న్త శబ్దములయొక్క, ద్రుతస్య=నకారమునకు, లుక్=లోపము, వా స్యాత్=వికల్పమున వచ్చును. తాఘనుఁడు, తానుఘనుఁడు. నేవింటి, నేనువింటి. వాక్యా న్తగతపదానాం చ- వాక్య=సీసపద్యాదుల చరణములు వాక్యములు, వానియొక్క, అ న్తగతపదానాంచ=అంత్యశబ్దములయొక్క నకారమునకును లోపము గలదు. అలరె నెత్తావి కేళీవనా గ్రసీమ (నగా గ్రసీమ)- నలడాదేః=న ల డ మొదలైన వర్ణములయొక్క, అ న్తః=నడిమి, ఉతః=ఉకారమునకు, లోపమౌను. కిన్క, చిల్క, గాడ్పు. ఆది శబ్దముచేత రేఫాదులకు నౌను. కార్ప్రెతు, గోర్పులి. ప్రయోగమహితానాం= ప్రయోగపూజ్యములైన, అన్యేషాం=మఱికొన్నింటికిని, ఉకారలోప మగును. నలడాదుల మఱికొన్నియచ్చులకు ననుట- మాన్చి, కల్చి, ఈడ్చి, కప్రము, అబ్రము. ప్రయోగమహితము లన్నందుచేత నుత్వములకును బ్రయోగసిద్ధమై ననే కాని లే దనుట. ఏనుఁగు, అడుఁగు.

శా. క్లీంకారాక్షరరూపిణీ నతజనక్లేశౌఘపంకావళీ
పంకేజాతసుహృద్ఘనాతపసదృక్పాదాబ్జ శశ్వన్నిరా
తంకాతూర్జిత భోగమోక్షజనకోదంచన్మహామాయకా
హ్రీంకారాక్షర హేమసౌధచర బ్రహ్మేంద్రాది దేవార్చితా.

గద్యము. ఇది శ్రీసకలభాషావాగనుశాసన నన్నయభట్టవిరచితాంధ్రశబ్దచింతామణియందు సకలకవితాస్వతంత్రభట్టారక యెలకూచి బాలసరస్వతి కవి మహోపాధ్యాయ ప్రణీతంబైన యాంధ్రశబ్దచింతామణిటీకా గ్రంథమునందు ద్వితీయము సంధిపరిచ్ఛేదము.

---

# అజన్తపరిచ్ఛేదము.

డుమువులవః ప్రథమా స్యా త్కూర్చిలనునయో భవేద్ద్వితీయా తు
తో చేతతోడచేచ తృతీయాయాః కొఱకు కై *చతుర్థ్యాః స్తః. ౧
పట్టివలనకంటె ఇతి పఞ్చ మ్యథ లోపలకికుయొక్కాః షష్ఠీ
అందిఁనునాస్తు సప్త మ్యోయీ త్యామన్త్రణం చ వికృతౌ స్యాత్. ౨

ఈసూర్యాయుగళ మేకసూత్రము. కొందఱనిది దందురు. డుమువులవః=డు, ము, వు, లు, అనునవి, ప్రథమా=ప్రథమావిభక్తి, స్యాత్=అగును. కూర్చిలనునయః=కూర్చి, ల, ను, ని, అనునవి, ద్వితీయాతు=ద్వితీయావిభక్తికి, భవేత్=అగును. తో చేత తోడ చే చ=తో, చేత, తోడ, చే, అనునవి, తృతీయాయాః=తృతీయావిభక్తికి, స్యాత్=అగును. కొఱకు కై=కొఱకు, కై, అనునవి, చతుర్థ్యాః=చతుర్థీవిభక్తికి, స్తః=అగును. పట్టివలనకంటె ఇతి=పట్టి, వలన, కంటె, అనునవి, పఞ్చమీ=పంచమీవిభక్తి, అథ=ఆవెనుక, లోపలకికుయొక్కాః=లోపల, కి, కు, యొక్క, అనునవి, షష్ఠీ=షష్ఠీవిభక్తి. అందిఁనునాః=అందు, ఇంను, న, అనునవి, సప్తమీతు=సప్తమీవిభక్తి. వికృతౌ=తెనుఁగునందు, ఓయి ఇతి=ఓయి యనునది, ఆమన్త్రణం=సంబుద్ధి-స్యాత్=అగును.

క. డులుమువులు ప్రథమ. నినుకూ, ర్చిలలు ద్వితీయ-మఱి తోడ చేచేతపదం
బులుదాఁదృతీయ-కైకొఱ,కులుదలఁపఁజతుర్థియునునగును దెనుఁగునకున్.
గీ. పట్టివలనకంటెయనఁగఁబంచమీవి,భక్తి-యగుఁ గికుయొక్కలోపలలుషష్ఠి
జగతిలోనిందునందునసప్తమియగు,నోయియనఁగసంబుద్ధియాంధ్రోక్తులందు.

---

స్త్రీపశుజడా న్వినా న్యే మహదాఖ్యా స్తద్విశేషణా శ్చాపి
మహతోఽత ఉద్విభక్తౌ మహతస్సో ర్డు జనితో భవే త్పుంసి. 3

ఇది మూఁడుసూత్రములు. స్త్రీ పశు జడా౯ వినా=స్త్రీవాచకములు, పశువాచకములు, జడవాచకములును వినాగాను, అన్యే=తక్కినవియు, తద్విశేషణాశ్చాపి=వాని విశేషణములును, మహదాఖ్యాః=మహత్తు లనుసంజ్ఞగలవి. మహతః=మహత్సంజ్ఞగలదానికి, విభక్తౌ=విభక్తి పరమైనపుడు, అతః=అకారాంతమునకు, ఉత్=ఉకారమును వచ్చును. అనితః=ఇకారాంతవ్యతిరిక్తమైన, మహతః=మహత్తుయొక్క, సోః=ప్రథమైకవచనమునకు, పుంసి=పుంలింగమందు,

*కొందఱు కై అని, కొందఱు కయి అని పాడిరి.

డుజ్=డుజ్ అనునాదేశము, భవేత్=అగును. సు, ఔ, అమ్ మొదలైనవి శబ్ద శాస్త్రవ్యవహారమునఁ బ్రథమా ద్వితీయాది విభక్తులకు సంజ్ఞలుగాఁ జెప్పఁచున్నాఁడు, గాని, యిందు లేవు. అది యెట్లంటేని- అర్థవదధాతు రప్రత్యయః ప్రాతిపదికం-ధాతుప్రత్యయవర్జ్య మర్థవచ్ఛబ్దరూపం ప్రాతిపదిక సంజ్ఞం స్యాత్; ధాతుప్రత్యయవర్జ్యము, అర్థవచ్ఛబ్దరూపము, ప్రాతిపదిక సంజ్ఞగలది యగును. భూసత్తాయామ్, డుకృఞ్ కరణే, మొదలైన ధాతువులును, తక్, తఞ్, మొదలైన ప్రత్యయములును గాక, అర్థవంతము లైన శబ్దరూపము లెల్లను బ్రాతిపదికము లనఁబడును. జ్యాప్ప్రాతిపదికాత్-జ్యంతాదాబంతాత్ ప్రాతిపదికాచ్చ పరతః స్వాదిప్రత్యయాః స్యుః- పార్వతీ, గౌరీ మొదలైన జీప్రత్యయాంతములమీఁదను, చండికా, అంబికా మొదలైన ఆప్ప్రత్యయాంతములమీఁదను, రామ, కృష్ణ, మొదలయిన ప్రాతిపదికలమీఁదను, సు మొదలయిన యేడు విభక్తుల ప్రత్యయములును వచ్చును. అవి యెవంటేని- స్వౌజసమౌట్ ఛష్టాభ్యామ్భిస్ జేభ్యామ్భ్యస్ జసిభ్యామ్భ్యస్ జసోసామ్ జ్యోస్సుప్.

| ఏకవచనము. | ద్వివచనము. | బహువచనము. | విభక్తి. |
|---|---|---|---|
| సు | ఔ | జస్ | ఇది ప్రథమావిభక్తి. |
| అమ్ | ఔట్ | శస్ | ఇది ద్వితీయావిభక్తి. |
| టా | భ్యామ్ | భిస్ | ఇది తృతీయావిభక్తి. |
| ఙే | భ్యామ్ | భ్యస్ | ఇది చతుర్థీవిభక్తి. |
| ఙసి | భ్యామ్ | భ్యస్ | ఇది పంచమీవిభక్తి. |
| ఙస్ | ఓస్ | ఆమ్ | ఇది షష్ఠీవిభక్తి. |
| ఙి | ఓస్ | సుప్ | ఇది సప్తమీవిభక్తి. |

ఈయేడింటికిని నేకవచన బహువచన ద్వివచనము లైన యీమూఁడేసిప్రత్యయములును నైన వని తెలియునది. ఇందులోఁ దెనుఁగునకు ద్వివచనము లేదు గనుక మొదలిది యేకవచనమును, మూఁడవది బహువచనము నని తెలిసికొనఁ దగినది. విభక్తులకు మేము చెప్పిన కందగీతులలోని సంకేతములు తెలిసికొనునది. ఇందుకు శబ్దనిష్పత్తి చేసికొనులక్షణము. మొదట రామశబ్దము చెప్పెదము:-

సంస్కృతము, ఆద్యప్రకృతి గనుక తన్న్యాయముననే ప్రాతిపదికసంజ్ఞను స్వాద్యుత్పత్తికిని బుట్టించునది. రామ సు అని యుండెను. అది యాంధ్రశబ్ద

ముగా వివక్షించునప్పుడు రామశబ్దము మహత్తు గనుక, "మహత స్సౌర్డుజ్" అనుసూత్రమున సు అను ప్రత్యయమును గొట్టి డుజ్ అనునాదేశము వచ్చును. "అనుక్త మన్యవత్" అనున్యాయము చెప్పితిమి గనుక, హలన్త్యమ్, ఉపదేశే న్త్యం హలిత్స్యాత్, అనుశబ్దసూత్రముచేత డుజ్‌లోని జకార మిత్తయ్యెను. "సానునాసికోచ్చారణాంజిత్" అను ప్రాకృతసూత్రముచేత దాపల నర్థబిందుయుక్తమాను. "మహతోతడుస్వ్వభక్తౌ" అని యకారమున కుకారము వచ్చును. "రాముఁడు" అని యర్థానుస్వారముతో నిలిచియుండిన "అనునాసికాభావపక్షే అనుస్వార స్స్యాత్" అని పూర్ణ బిందువాయెను. కనుక "రాముండు" అని కలను. హ్రస్వపరము గనుక "రాముఁడు". సర్వత్ర శబ్దనిష్పత్తు లిట్లులే తెలిసికొనునది. స్త్రీపశుజడాదులపట్ల నైన డుజాదులు లేవు. రంభ, వ్యాఘ్రము, వృక్షము. పశుశబ్దము తిర్యగ్జాతుల కెల్ల నుపలక్షణము. అటు గనుక గృధ్రము, కాకము, అనునవియును నమహత్తులు. మహత్తు లైనను జడాదులుగా వివక్షించినఁ గొన్ని యమహత్తు లగును. సముద్రము, మేఘము అజడములుగా వివక్షించితేని సముద్రుఁడు, మేఘుఁడు. తద్విశేషణములును మహత్తులే గనుక, ఘనుఁడైన రాముఁడు. అమహద్విశేషణము లైన నమహత్తులే; ఘన మైనవ్యాఘ్రము. "అనిత్యః" అన్నాఁడు గనుక, రఘుపతి, యదుపతి, యనుచోటుల డుజాదులు లేవు. "పుంసి అన్నాడు గనుక దశరథాపత్యము, బ్రహ్మము, అనుచోటుల లేవు.

---

అమన్త్రిణసుజసోః స్తః క్రమేణ చా దారదాగమౌ వన్తే
లుజసో లశసో లాన్తా ల్లాన్తాత్తు రురౌ తయోః క్రమేణ స్తః. ౪

ఇది మూఁడుసూత్రములు. అమన్త్రిణసుజసోః=సంబుద్ధ్యేకవచన బహువచనములకు, అన్తే=అంతమందు, క్రమేణ=క్రమముచేత, అదారదాగమౌ=అత్, ఆరత్, అనునాగమములు, స్తః=అగును. ఏకవచనమునకు, అత్ వచ్చినఁ దకారము పోయెను. సంబుద్ధిప్రత్యయమునకు డుజ్ వచ్చి "రాముఁడు" అని యుండఁగా, అకార మాత్రమందు నిలిచి "రాముఁడ" అని యుండెను. బహువచనమునకు "ఆరత్" వచ్చి తకారము పోయి "రాములు" అనురూపముమీఁద రాములార యని నిల్చెను. అలాన్తాత్=తుద లకారము లేని శబ్దముమీఁద, జసః=ప్రథమా బహువచనమునకు, లు=లు, అనునది, శసః=ద్వితీయాబహువచనమునకు, ల=ల, అనునది యు నగును. రాములు, రాముల,

లాన్తాత్ = తుద లకారము గల శబ్దములమీఁద, తయోస్తు = ప్రథమాబహువచన ద్వితీయాబహువచనములకు, క్రమేణ = వరుసచేత, రురౌ = రు, ర, అనునవి, స్తః = అవును. బాలురు, బాలుర; లాన్తాత్ అన్నాఁడు గనుక, ల, అనునది (లకారము) తుదనుండినసే గాని లి, లు, అనునవి తుద నుండిన రురలు లేవు. బుద్ధిశాలులు, దీర్ఘతాలులు.

---

నిరమో మహతాం లుక్చ స్యాచ్ఛాస్త్ర ప్రవచనీయకే కూర్చిః
మహతో నిలౌ విభక్తౌ టాఙా వచనద్వయే క్రమేణ స్తః. ౫

ఇది నాలుగు సూత్రములు. మహతాం = మహత్తులయొక్క, అమః = ద్వితీయైకవచనమునకు, నిః = ని అనునది వచ్చును. అమహత్తులమీఁద నైనఁ బరిశిష్టమైన ను అనునది వచ్చు నని తెలిసికొనునది. రాముని, సింహమును. లుక్చ = నినులకు లోపమును వచ్చును. రాము, సింహము, కర్మప్రవచనీయకే = శబ్దశాస్త్రములోఁ జెప్పఁబడిన కర్మప్రవచనీయ మను ద్వితీయాప్రదేశమందు, కూర్చి = కూర్చి యనునది, స్యాత్ = అగును. భక్తింగూర్చి జ్ఞానము దొరకెను. ద్వితీయాబహువచనము, రాముల. మహతః = మహత్తునకు, టాఙా = తృతీయ మొదలైన, విభక్తౌ = విభక్తి పరమైనపుడు, వచనద్వయే = ఏకవచనబహువచనములయందు, క్రమేణ = వరుసను, నిలౌ = ని, ల, అనునాగమములు, స్తః = అగును.

---

టాదివిభక్తౌ నిర్నేత్యేకే నామన్త్రణే డుకి త్యన్యే
టాసశ్చేతో జేపః కైకొ అకూ జసిస ఉచ్యతే వలనః. ౬

ఇది యైదుసూత్రములు. టాదివిభక్తౌ = తృతీయాదివిభక్తులు పరమై యుండిన, నిః = న్యాగమము, న = లేదు, ఇతి = ఇట్లని, ఏకే = కొందఱు పెద్దలనిరి. రాముచేత, రాముకొఱకు, రామువలన, రాముకు, రామునందు. ఆమన్త్రణే = సంబుద్ధియందు, డుక్ = డు కాదేశము, న = లేదు, ఇతి = అని, అన్యే = మఱికొంద ఱందురు. ఓరామ. అదాగమము సంబుద్ధిగూడినది. టాసః = తృతీయావిభక్తికి, చేతః = చేతాదేశము వచ్చును. మహతో నిలౌ విభక్తౌ టాఙా, అని నిలలు వచ్చిన, రామునిచేత, రాములచేత. తృతీయాఙా, అనక, టాఙా అని యేకవచన ప్రధానముగా నిర్దేశించినాఁడు గనుక యీకార్య మేకవచనములకే యవశ్యము. బహువచనములకును, అమహత్తులకును లాగమము వచ్చు నని జ్ఞాపకము. సింహములచేత, సింహములకొఱకు. నిలలు వైవక్షితవిభక్తులందును వచ్చును. అటుగనుక సమాసముల విభక్తులకు లోపములైన నవును.

మ. కుడిక న్నంబుజబాంధవుం డెడమక న్గోకాహితుం డగ్గిని
న్నడుమ న్నిక్కిలికన్ను నం దొకట కెంట న్మోట ముచ్చెయ్యెలిం
పడర న్నిగ్రహమం దనుగ్రహమునం దైక్యంబు సంధింతు చే
ద్పడు వేళం బెడనాభిధానశివపూర్వస్త్యాద్యగస్త్యేశ్వరా. ౨౪

మ. కడువేగ౯ గుడిస్రింగువాని కట లింగం బ్లోక టద్దానె ని
వ్వడి లోఁగొన్నమహానుభావునకుఁ గైవల్యంబు ముందెప్ప డం
చడుగంగాఁ బనియేమి తక్షణమ వశ్యం బొటయే గాక చొ
ప్పడకున్నే పెడనాభిధానశివపూర్వ- ౨౫

మ. చనుచో నల్లక పట్టితెచ్చి మధురాజ్యక్షీరము ల్పోసి పెం
చినసర్పంబు విషంబు మానని క్రియ౯ శీలంబు లెన్నెన్ని చె
ప్పిన మూఢుండు (నిజంబు) గన్గొనఁడు తద్వృత్తంబు లానైజక
ర్మనిరూఢిం బెడనాభిధానశివ- ౨౬

శా. ధీరోదారగభీరవాజ్ఝుర ... ... ... ... ...
... ... ... ... ... ... ... ... ...గానోపుకా
వేరీవారి మునింగియున్నశిల పృథ్విన్మెత్తనౌనే కృపా
పారీణా పెడనాభిధానశివ- ౨౭

శా. అర్వాచీనవటద్రుమూలఫలవిద్యామూర్తి భాస్వన్నిజా
శీర్వాదస్థిరవర్ధమానమునిరాజీజ్ఞానదీపాంకురా
ఖర్వస్ఫూర్తి సమస్తలోకహితభక్తవ్రాతహృద్వర్తిదృ
క్పర్వా శ్రీపెడనాభిధానశివ- ౨౮

మ. తనువెన్నంటఁ గడంగివచ్చు యముపంతం బంత దూలించి ని
న్ననుఁగుంగౌఁగిలి లోఁగొనం గనిన నిత్యానందుని న్మానినం
దనునిం గాచి పదాహతిం గెడపి తౌ దండాయుధు న్సాధుమా
ర్గనిరోధుం బెడనాభిధాన- ౨౯

మ. కడలిం బుట్టి దివంబు ముట్టి కడిమి న్గన్పట్టి జేజేల ని
ల్లడలెల్ల న్విడఁగొట్టి మిట్టిపడు నా కాకోలముంబట్టి నే
రెడుఁబండుం బలెనొత్తి పట్టి విగతార్తిం గ్రోలి తింత్రైన వె
ల్వడనీకం బెడనాభిధానశివ- ౩౦

మ. మదమాతంగబలాంతకారి చటులోన్మాదంబున న్మన్న ద

న్నెదురుం గానక నీదుకయ్యమునకై యేతేరఁ బోకార్చి నే
ర్పొదవందాల్చి తదాజినంబు కృతకృత్యుం జేసితో వానిఁ జే
వదలిర్పం బెడనాభిధానశివ- ౮౧

శా. ఔరా తారకుఁ డల్గి సర్వ మెడసేయం గల్గి పెంజివ్వ కిం
పార న్నిన్ను మగంటిమి న్నెగడి నిప్పై వెల్గి చల్లాఱెఁ దా
నాఱంబోయిన దీపమోన భవదీయంబైన కౌమారశం
పాశోచిం బెడనాభిధాన- ౮౨

మ. సురసంఘాత విఘాతన ప్రతతపటిష్ఠుండైన యయ్యంధకా
సురు విధ్వంస మొనర్చి (యంత) దిగనీశు ల్పూర్వసామ్రాజ్యసం
భరణు ల్గా నభయప్రదాత వగుచు న్భాసిల్లితో లోక భా
స్వరలీలం బెడనాభిధాన- ౮౩

మ. రథరథ్యద్విరథాంగసారథిధనుర్బాణేషుధిజ్యాళియా
పృథివీనేదరవీందువాక్పతిసురాద్రిశ్రీవధూనాథవా
ర్నిధిభోగీంద్రులుగాఁ బురత్రితయము న్నిర్జించు నీచర్య లు
గ్రధురంబుల్ పెడనాభిధానశివ- ౮౪

శా. గాంగేయాచలచాప నీకొడలు నై గంగన్నఁ గన్పట్టు నీ
లింగాంగిం గనుచో మొఱంగెదరు పాళిం గొంద అజ్ఞాను లే
నుంగుం గన్గొను కుక్కలుం బలెను మన్ను న్మిన్ను నీవెన్నఁగా
వంగానేఁ బెడనాభిధాన- ౮౫

మ. శివనిందాపరులైనవారికిది భాసిల్లంగ దృష్టంబటం
చవలీల న్మఖదీక్షితుం డఘుపురాధ్యక్షుండు దక్షుండు ము
న్నవలాలాయుత మైన గొఱ్ఱెతలతోడం గుండఁగా నున్న మా
న్యవశంబే పెడనాభిధాన- ౮౬

మ. సుమనస్కుం డొకవేళ నార్వితమనస్తోకంబుగా ముట్టిన
న్విమలజ్ఞానము గోలుపోయి నినుగా వేఱెందుచేపట్టునే
నుమనస్సింధువు నైజ మొందదె విషార్భుల్ గ్రమ్మఱం బుట్టి తం
త్రమఖేశా పెడనాభిధానశివపూ- ౮౭

మ. మలదేహు ల్పదివేలు గూడినను సామ్యం బొందురే నిత్యని
ర్మలచిత్తుం డగు న్నొక్కభక్తునికి సామాన్యంబు పో దున్న ము

న్నలరాయించ కనంగుపుల్గులు సమం బౌనయ్య వేఁజోఁడనా
వలదింకం బెడనాభిధానశివపూర్వస్త్యాద్యగస్త్యేశ్వరా. ౮౮
శా. నీలగ్రీవ మహానుభావ త్రిజగన్నిర్మాణపారీణ కా
కోలాహార భుజంగహార నగరాట్కోదండ సంపోషితా
భీలాంభోజభవాండభాండ సదరీభృద్వల్లభస్నేహకృ
త్పౌలస్త్యా పెడనాభిధాన- ౮౯
మ. బగుతుం డెంతయు నాజపంజన సుఖభ్రాంతిం దగుల్కొన్న నీ
జిగి యజ్ఞానముగాదు వాని యెడ కౌచిత్యంబు గాదేని పై
నిగుడుల్ గప్పిన నిప్పునందు సెకలేనేలేదె నాసామి నీ
వగపేలా పెడనాభిధానశివ- ౯౦
శా. ప్రాదుర్భావవివేకమర్కటకిశోరన్యాయ మింపొంద మీ
పాదాబ్జంబులనంటి జంటగనుతేవన్నామనఃపుష్ప మా
మోదం బైనది యందుఁ బొందుగఁ జిదాభోగంబు నీకెందు కీ
వాదంబో పెడనాభిధానశివ- ౯౧
శా. పూనన్లేద బిడాల మార్జశిశువుం బొందానె నాపిల్లలై
తేనేతీఱునఁ ద్రిప్పినం దిరుగు నింతేకాని నావల్ల నే
మౌనయ్యా ననుఁ గన్నతండ్రి విలఁ జోద్యంబె మదిన్నీ కుమా
ప్రాణేశా పెడనాభిధానశివపూ. ౯౨
మ. పలుమాఱుం బలుకం బనేమిపుడు నా భాగ్యంబహో దేవ భూ
తల నిత్యోత్సవ నీవు నేననెడి భేదంబూడ్చి నిన్నాటపా
టల ముప్పూటలు గొల్చెదన్ భ్రమరకీటన్యాయసంసిద్ధి తా
వలమయ్యెం బెడనాభిధానశివ- ౯౩
మ. ఘటజన్మార్చితపాదపద్మ నిజభక్తిస్వాంతరాజీవ వి
స్ఫుటలీలామణిసద్మ సంహృతజనస్తోమాతిదుర్దాంతహృ
జ్జటిలచ్ఛద్మసమస్తయోగి సుమనస్సంవేద్య విద్యుజ్జటా
పటలీభృత్పెడనాభిధానశివపూ. ౯౪
మ. శ్రవణానందముగా భవన్మహిమ లశ్రాంతంబు నే వింటి నీ
నవహేలాకృతి లోచనోత్సవ ముదీర్ణం బైతిగం గంటి మ
ద్భవబంధంబు విడంగఁ గొంటి నిను నీ భక్తుండనై మంటి గా

రవ మజ్బ్యెం బెడనాభిధానశివపూర్వస్త్యాద్యగస్త్యేశ్వరా. ౯౫

మ. మొదటం దెల్పిని గొంత ముందెలియ కేమో కొంత భూషించితి
న్నది దూషించితి నిన్ను నేమయినను న్నన్నంచు టర్థాంబు మ్రో
క్కైద నే దాసరితప్పు దండమున నా కీడెంచి మేలెంచ సం
పదగల్గుం బెడనాభిధానశివ. ౯౬

మ. నతపంతాన భవత్ప్రసాదమునఁ జూర్ణప్రాయమై మత్పురా
కృతదుష్టర్షవితాన మంతయుఁ దొలఁగె న్నిత్యలింగార్చనా
రతి సాఫల్యముఁ జెందె నామతిఁ బునర్జన్మం బలభ్యంబు సు
వ్రతి నైతిం బెడనాభిధానశివ. ౯౭

శా. నావృత్తాంతము విన్నవించితి సకృత్సన్నంబంత యాలించి తీ
వావంతైనఁ గొఱంత లేదు కడుమే లయ్యె న్నరేకాక నీ
సేవ న్సుస్థిర మైన ముక్తి నను డాసె న్నీవు నుం దోడుగా
రావచ్చుం బెడనాభిధానశివ. ౯౮

శా. ప్రారంభంబున ని న్గ్రౄతిశ్వరునిగా భావించి నేఁ జెప్ప నో
ప్పారం బూనిన నీసుభక్తిశతకం బయ్యెం బ్రపూర్ణంబు చే
తోరాఢిఁ మఱి చిత్తగించి ముదితాత్మం జేకువే సద్ఘృణా
పారీణా! పెడనాభిధానశివపూ. ౯౯

శా. ఎన్న న్వాక్కుల సన్నుతింతు నను టెంతే కాని తత్త్రైశలం
బెన్న న్నీస్తుతి గాదె కాన మఱి నీకే చెల్లు నిందెట్టి త
ప్పున్నన్నన్ను క్షమించి కాచుకొనునుద్యోగంబు దూరీకృతా
పన్నార్తా పెడనాభిధానశివపూర్వస్త్యాద్యగస్త్యేశ్వరా. ౧౦౦

శా. భావింపఁ జనులెల్ల నీభువి భవద్భవ్యాభిధానాంకితం
బై వాక్చాతురి మీఱి సుస్తుతిహితం బాచంద్రతారార్కముఁ
... ... ... ... ... ౧౦౧

శా. శ్రీమంతు ల్మతిమంతు లుజ్జ్వలయశశ్శ్రీనాథసీమంతినీ
సామంతుల్ ఘనుకౌఁదురీనగరసంస్థాను ల్సదావృత్తినీ
నామోచ్చారణనిష్ఠఁ జేసి మఱి దీనత్రాణపారీణతా
ప్రాముఖ్యు ల్పెడనాభిధానశివ. ౧౦౨

శా. శ్రీయుం జేయును బాపు నాపదల నుర్వీన్నీమహాప్రార్థనం

శాయుర్వృద్ధి యశస్సమృద్ధి హితవిద్యాబుద్ధిసంశుద్ధి ని
శ్శ్రేయస్సిద్ధి యొసంగుఁగాత నిరతశ్రీరస్తు మత్సంగత
ప్రాయస్తే పెడనాభిధానశివ. ౧౦౩

శా. చిల్లీలాకృతి మల్లికార్జునఇతిశ్రీపండితారాధ్యహృ
త్ఫుల్లాంభోజవిహార భూరివిలసత్ప్రప్పంధయస్వామివై
మల్లంపల్లి వసించియున్న త్రిజగన్మాన్యుండ వీవంత్రు సం
పల్లీనా పెడనాభిధానశివపూర్వ. ౧౦౪

శా. గంగాభోగవతీభుజంగ భుజగగ్రైవేయకోత్తుంగ సా
రంగాస్వప్నవిపక్షభంగ కరసంప్రాప్తైకసారంగ సా
రంగాంక ప్రథితోత్తమాంగ మృదుసారంగీదృగార్యాపరి
ష్వంగాంగా పెడనాభిధానశివపూర్వస్త్యాద్యగస్త్యేశ్వరా. ౧౦౫

మల్లంపల్లి మల్లికార్జునపండితారాధ్యవిరచితము.

సంపూర్ణము.

ఈశతకము

జగ్గయ్యపేఁటనివాసులు బ్ర॥ ములుగు వీరభద్రశాస్త్రిగారిచ్చినది.

---

శ్రీరస్తు.

# 3. మన్నారుకృష్ణశతకము.

పైఁడిపాటి వేంకటనృసింహకవి.

---

## సీసపద్యములు.

### (1) స్తుతిదశకము

శ్రీరుక్మిణీరమాక్రీడాకళాసత్య సత్యభామామనోజలజమిత్ర
మిత్రవిందాధరామృతపానచాతుర్య తుర్యకాళిందీనదీప్రసంగ
సంగమసిపుణలక్షణలక్షణాధీన ధీనయునాగ్నజితీప్రసాద
సాదరసల్లాపజాంబవతీలోల లోలదృగ్భద్రాముదాలవాల
వాలఖిల్యాదిమునిసంస్తవప్రభావ, భావమున నెంతు నిను విష్ణుప్రచారుఁ
జారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౧

పద్మావతీమనఃపంకజసారంగ రంగదంభోధిపర్యంకమోద
మోదకభుక్తాతసాదరసాంగత్య గత్యంతరాభావఖచరరక్ష
రక్షశ్చమూమహారణ్యపావకకీల కీలాలభృత్తుల్యనీలవర్ణ
వర్ణమాలాజవోదీర్ణమంత్రాధార ధారణాయోగమేధావివరద
వరదయామతికుజవధూర్వహామునఁడువ, నడువ వేమందకని వేఁడుపుడమి నెంతుఁ
జారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౨

ప్రకృతికార్యేతరప్రబలనిత్యానంద నందనీకృతశతానందకామ
కామాదివర్గగతమోమహితాదిత్య దిత్యపత్యసహోవదీననాగ
నాగలోకవిభుత్వభోగభోగిశయాన యానవేగఖగాధిపానిశాశ్వ
శాశ్వతవసుగుణైశ్వర్యదనామాంక మాంకస్థలలితోత్తమాంగదేవ
దేవకీకుక్షి వెడలి పీతెత్తుపరిగె, పరిగెనని వేఁడురుద్రాదిసురల నెంతుఁ, జారు.

నిఖలవేదాంతోపనిషదర్థసంభావ్య భావ్యతీతశుభాశుభద్వయజ్ఞ
యజ్ఞపర్యవసానహవ్యవపాహార హారకుండలభూషితాంగబృంద
బృందారకాష్టదిగీశరక్షణదక్ష దక్షాధ్వరాహిత దైవమాన్య
మాన్యత్రిభువనసామ్రాజ్యసంపద్భోగ భోగసంభృతపరిస్ఫుటమహీన
హీనమతివత్సబాలుర నెత్తిదాఁచి, దాచియుత్కైతినని వేఁడుధాత నెంతుఁ, జారు.

విశ్వసృష్టిస్థితివిలయకార్యనిదాన దానకృజ్జనకల్పతరుసమాన
మానసపూజావిధానహృష్టస్వాంత స్వాంతరింద్రియజిదార్యప్రణామ
నామజపావృత్తినీమవచోవాస వాసనాత్రితయనివారచతుర

చతురంతజాతిసంస్కారపరిష్కార కారణాచార్యయోగ ప్రసిద్ధ
సిద్ధవందితచాలవర్ణించిమరల,మరలఁ దెలిసితినని వేఁడుమఘువుఁ దలఁతుఁ,జారు.
గంగానదీజన్మకారణపదపద్మ పద్మామనోహారావచితిధిషణ
ధిషణమంత్రేతరదితిజభంగవిచిత్ర చిత్రాంశు తేజోవిశేషబీజ
బీజవత్పుషితనానాజీవపరివార వారణేంద్రఘన స్తవప్రియాత్మ
యాత్మకళాలోకనాక్యతుర్యాసన్న సన్నహానాసురసైన్యహారణ
హారనరేంద్రార్చితశ్రీపదారవింద,వింద వైతివియని వేఁడువిమరు నెంతుఁ,జారు.
ఉభయపార్శ్వవిభాస్వదుదధికన్యాగోత్ర గోత్రజేశస్తుతఘోరకర్మ
కర్మత్రయీబద్ధకవిమానసాసాధ్య సాధ్యచారణసమర్చ్యా ప్రసన్న
సన్నద్ధమధుదైత్యసముపేతసంగ్రామ గ్రామణిగుణశార్ఙ్గ నామధర్మ
ధర్మాదిపూరుషార్థప్రదతాత్పర్య పర్యంకికృచ్ఛేషఫణికులేశ
లేశమునునిన్నువివరింపలేకనాఁడు,నాఁడునవ్వుదునని వేఁడువరుని నెంతుఁ,జారు.
సనకాదిమునిమనశ్చరదంఘ్రిరాజీవ జీవతనుత్రయస్థిరనిశాంత
శాంతమానసజనైకాంతదృక్సుముదిత ముదితానుసంధానమునివితాన
తానగానచణత్రిదశమానియోగార్హ్యగార్హ్యపత్యాద్యగ్నిగతవపాద
పాదసంక్రాంతదిక్పతికిరీటస్తోమ సోమసూర్యగ్రహాసురుచిరాక్ష
రాక్షసాంతకదివ్యవిగ్రహాఖసూచి, సూచినక్లెంతుననినభీష్మునినుతింతుఁ,జారు.
ప్రతిదినాకాంక్షితపద్మాస్వయంగ్రాహ గ్రాహపీడితగజకష్టశమన
శమననందనరిపుక్షయదిగ్విజయమూల మూలప్రకృతికార్యజాలఖేల
ఖేలాంతరాళస్థలీలాచిదాభాస భాసమానసువర్ణభావుకపట
కపటనాటకకృతోద్గత జగద్వ్యతిరిక్త రిక్తసాధువిపత్సరిత్సుతరణి
తరణినిభనీహితోక్తులవిరిసెఁదమను,తమముఖముఁగంటిననినయుద్ధవుఁగణింతుఁ,
జారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౯
శ్రీయాదవాన్వయశ్రేయస్సరోహంస హంసశీతాంశుదివ్యావలోక
లోకేశలీలావివేకకార్యవికల్ప కల్పద్రుసురధేనుకల్పదాన
దానవగణమహీధరమహోగ్రశతార తారాభదధికణాకారకలిత
కలితమస్వాంతముష్కరదర్శనాభావ భావజముఖతనూభవనికాయ
కాయపరిదిగ్ధదుగ్ధప్రకాశమాన,మానసీసేవనిల్వునామానసమునఁ,
జారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౧౦

# మన్నారుకృష్ణశతకము.

## (౨) దాససంగతిదశకము.

వర దేవకీగర్భవారిధిద్విజరాజ ద్విజరాజగమనావతీర్ణభువన
వసుదేవకంససేవాతమఃపద్మాప్త పద్మాప్తచేటీశపస్సపర్య
కృతయశోదాకుచక్షీరపానాదర నాదరహాస్యానుమోదచిత్త
వర్ధితనందగోవత్సనానాభీర నాభీరణస్థూలిహీణప్రసంగ
యాపదుద్ధారననుఁ బ్రోవుసాపరాధి, రాధికాగోపనృపవధూరత్నజార, చారు
సాఁగి మ్రొక్కియుదు భీష్మకనందనాలోల నాలోలవృత్తి నెన్నంగఁబోకు
గణుతింతు నినుఁ బాతకస్పర్శనాహీన నాహీనకృత్య మెన్నంగఁబోకు
కీర్తింతు రక్షితకృష్ణార్జునాక్రూర నాక్రూరచేష్ట లెన్నంగఁబోకు
సేవింతుఁ గరధృతగోవర్ధనాచల నాచలచిత్త మెన్నంగఁ బోకు
మిట్టి వ్రాత్యుఁడ నాభాగ్య మేమొకాని, కాని నీసేవ నేఁటికి గలిగె నాకుఁ
జారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౧౨
హాయిగాఁ గనవశంబే యుష్మదాస్యంబు దాస్యంబు సేయని తామసులకుఁ
దెలియశక్యమె భవదీయప్రభావంబు భావంబుచలియించు పామరులకు
వినుతింపఁ దరమౌనె వేణుభృద్వేషంబు ద్వేషంబుమదినొప్పు ద్రిమ్మరులకుఁ
బ్రాపింపనేర్చునే భవదవలోకంబు లోకంబునడకల ప్రాకృతులకు
ననఘు యీదుర్గుణములచే నలరు జడునిఁ, జెడు నిరర్థకు నను దరిజేర్చుటెట్లు
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౧౩
కృతిచెప్పు మని ప్రల్లరింపనేచాలవా చాలవాచాలకశక్తి గలిగి
నావిన్నపముఁ గూర్మిమై వినఁగోరవా గోరవాకర్ణనకుతుక మెఱఁగి
యనఘుఁ జేసితి నని యభయ మీఁజేరవా జారవామాక్షులసఖ్య మెఱఁగి
ననుఁగొల్చి కడతేరినాఁ డని వాడవా వాడవాడల మ్రుచ్చు జాడ లెఱఁగి
యిట్టిచాతుర్యతుర్యము లెఱఁగియున్న, యున్నతస్థాననాదైన్యముడుపఁగదవె
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౧౪
సకళత్రపుత్రవంచకుఁడ మన్మేలుకో మేలుకోయని దయామృదులహృదయ
గతజన్మకర్మపీడితుఁడ నన్నాదుకో నాదుకోరికలిచ్చి నలిననాభ
కన్నతండ్రివిధంబు నన్నుఁ జేపట్టుకో పట్టుకోకలు మొలఁగట్టుశౌరి
పూతచిత్తునిఁజేసి పుణ్యంబు గట్టుకో గట్టుకోమలపాణిఁ గట్టినహరి
సేవకుఁడనంచుఁబలుమాఱుఁ జెప్పుకుందు, కుందునాయదిదైన్యంబునొంద నీకు
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౧౫

ఏ లూ రు.

# గోపాల్ ఆయుర్వేదావారి లోకప్రసిద్ధిగాంచిన
# కమలాకర కస్తూరి మాత్రలు.



## చంటిబిడ్డలు గర్భిణిస్త్రీలుగల ప్రతియింట ముఖ్యముగా నుండతగినవి.



ఇందు రస, విష గంధకాదులు చేరలేదు. వెలగల వనమూలికలచే తయారు చేయబడినవి. ఏజంట్లుగా నుండగోరువారు వివరములకు వ్రాయుడు.

**100 మాత్రల ప్యాకెట్టు రు 0—4—0.**

**డజను ప్యాకెట్లు రు 2—8—0 లు.**

☛ ఆర్డరుతో కూడ సొమ్ము పంపిన, రిజిస్ట్రీ పార్శిలు ద్వారా పంపబడును. వి. పి. గా పంపబడవు. (పోస్టేజి ప్రత్యేకము.)

గర్భిణీ స్త్రీలు ప్రతిదినము రెండుమాత్రలు తాంబూలముతో సేవించుచుండిన యే వ్యాధిని చేరనివ్వక పోవుటయే గాక బిడ్డలకు శరీరకాంతి నిచ్చి బలవంతులను జేయును. చంటిబిడ్డలకువచ్చు జన్నిరోగములకు, జలుబులకు, దగ్గులకు, విరేచనములవుటకు, కట్టుటకు, జిగట విరేచనములు కట్టుటకు, అజీర్ణములకు, వాంతులకు, కడుపుబ్బులకు, బలుహారము భుజించి ఆయాసపడువారలకు, బాల, వృద్ధ, యౌవనులకు గూడ యీ పైవ్యాధులున్న యెడల యీ మాత్రలు అనుపాన పత్రిక ప్రకారము నుపయోగించిన సదరు వ్యాధులను పోగొట్టును. (అనుపాన పత్రిక ప్యాకెట్టునందు గలదు.)

వలయువారు:—**గోపాల్ ఆయుర్వేద, ఏలూరు.**

(పశ్చిమ గోదావరిజిల్లా.)

# కాకినాడ పరిషత్కార్యాలయమున వెలకు దొరకు

# గ్రంథములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | విప్రనారాయణచరిత్రము-చదలువాడ మల్లయకవి | రు 0 | 8 | 0 |
| 2 | కవిజనాశ్రయము-వేములవాడ భీమకవి | 0 | 10 | 0 |
| 3 | చంపూరామాయణము-ఋగ్వేదికవి వేంకటాచలపతికవి | 1 | 0 | 0 |
| 4 | నీతిసీసపద్యశతకము-తాళ్ళపాక పెదతిరుమలార్యుఁడు | 0 | 2 | 0 |
| 5 | జ్యోతిశ్శాస్త్రసారము- శ్రీమాన్ కపిస్థలం కృష్ణమాచార్యులుగారు | 0 | 8 | 0 |
| 6 | జ్ఞానప్రసూనాంబికాశతకము-శిష్టు సర్వశాస్త్రికవి | 0 | 2 | 0 |
| 7 | సర్వేశ్వరశతకము-యథావాక్కుల అన్నమయ్యగారు | 0 | 8 | 0 |
| 8 | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము- జ. రామయ్యపంతులుంగారు, | 0 | 8 | 0 |
| 9 | కావ్యాలంకారచూడామణి- విన్నకోట పెద్దయకవి | 0 | 8 | 0 |
| 10 | చంద్రభానుచరిత్రము-తరిగొప్పుల మల్లనకవి | 1 | 0 | 0 |
| 11 | అకారాద్యముద్రిత గ్రంథసూచిక | 0 | 8 | 0 |
| 12 | ప్రాకృతభాషోత్పత్తి-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | 0 | 12 | 0 |
| 13 | శివతత్త్వసారము-మల్లికార్జున పండితారాధ్యులు | 0 | 12 | 0 |
| 14 | Defence of Literary Telugu జయంతి రామయ్యపంతులుంగారు | 0 | 8 | 0 |
| 15 | శివరాత్రిమాహాత్మ్యము-శ్రీనాథమహాకవి | 0 | 12 | 0 |
| 16 | ఆర్యభాషావిభాగము-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | 0 | 8 | 0 |
| 17 | Dravidian Lexicography జయంతి రామయ్యపంతులుగారు | 0 | 4 | 0 |
| 18 | ప్రాస్వరంగములు-కొత్తపల్లి సూర్యరావుగారు | 0 | 8 | 0 |
| 19 | నారసింహపురాణము—ఉత్తరభాగము-హరిభట్టు | 1 | 0 | 0 |
| 20 | మన్నారుదాస విలాసనాటకము—రంగాజమ్మ | 0 | 8 | 0 |
| 21 | జైమినిభారతము-వచనము-వేంకటకృష్ణప్పనాయఁకుఁడు | 0 | 12 | 0 |
| 22 | కాళిందీకన్యాపరిణయము (మొదటిభాగము) అహోబలపతి | 1 | 0 | 0 |
| 23 | రెడ్డినాఁటి రెండుశాసనములు | 0 | 4 | 0 |
| 24 | ఆంధ్రధాతుమాల | 0 | 12 | 0 |
| 25 | కాళిందీకన్యాపరిణయము (ద్వితీయభాగము) అహోబలపతి. | 0 | 8 | 0 |
| 26 | శాసనపద్యమంజరి | 0 | 12 | 0 |
| 27 | శతకసముచ్చయము (ప్రథమభాగము) | 0 | 12 | 0 |
| 28 | పరిషత్పుస్తకభాండాగారము. (ద్వితీయభాగము) | 0 | 8 | 0 |
| 29 | సూత్రాంధ్రవ్యాకరణములు—చిన్నయ్యసూరి | 0 | 8 | 0 |
| 30 | రసాభరణము—అనంతకవి. | 0 | 8 | 0 |
| 31 | కాళిందీకన్యాపరిణయము (రెండుభాగములు) | 1 | 4 | 0 |
| 32 | చాటుధారాచమత్కారసారః- (సంస్కృతము) | 0 | 8 | 0 |

కార్యదర్శులు-ఆంధ్రసాహిత్యపరిషత్తు, కాకినాడ.

Printed by N. Achutaramiah at the Cocanada Printing works, Cocanada